గోలకొండపత్రిక

వృషనామ సం॥ర ఫాల్గుణశు॥౧౧ గురువారము

# కొత్త జనాభా

హిందూస్థానములో పరిశ్రమల అభివృద్ధికి అవకాశాలు కలుగుటలేదు. మోటారు పరిశ్రమను స్థాపించుటకై బ్రిటిషు ప్రభుత్వము వారు సెలవియ్యకపోయిరి. నౌకాపరిశ్రమలకథ అందరికినీ తెలిసినదే. ఎంతో కష్టముపై వాల్చేరులో ఒకచిన్న పరిశ్రమ స్థాపితమయ్యెను. విమానాలకు కావలసిన ఇంజనులు ఈ దేశములో సిద్ధముకావు. బెంగుళూరులో విమానాలరెక్కలు ఇతర భాగములు మాత్రమే సిద్ధమగుచున్నవి. అయితే ఒక్క పరిశ్రమలో మాత్రము మనము అగ్రస్థానము వహించినాము. అది సంతానోత్పత్తి పరిశ్రమ. ఈ డెబ్బైఏండ్లలో మనదేశ జనసంఖ్య ఇంచుమించు రెండంతలైనది.

ఇటీవల హైద్రాబాదు ప్రభుత్వము వారు ౧౯౪౧నాటి జనాభా పట్టికను సంగ్రహ కరపత్రరూపముగా ప్రకటించియున్నారు. దీనిని బట్టిచూచిన కొన్నివిషయాలు ముఖ్యముగా గమనింపదగినవి స్ఫురించుచున్నవి. సమగ్రముగు గ్రంథము బహుశా ఈసంవత్సరాంతములో లభించును-అప్పుడు మరొకమారు నూతనాంశములను తెలుసుకొనవచ్చును. ఇప్పటి లెక్క ప్రకారము హైద్రాబాదుజనసంఖ్య ౧కోటి ౬౩ లక్షలవరకున్నది. మొత్తము ఇండియాలో ఈపదేండ్లలో నూటికి ౧౫ప్రకారము జనసంఖ్య హెచ్చైనది. హైద్రాబాదు రాష్ట్రములో నూటికి ౧౩ ప్రకారము హెచ్చైనది. యాభై యేండ్లక్రిందట ఈరాష్ట్రములో ఎంతజనసంఖ్యయుండెనో అంతకు రెండంతలసంఖ్య యిప్పుడున్నది. ఈ విధముగా జనసంఖ్య పెరిగినను ఇప్పటికిని మనము ధన్యులమే. జనసంఖ్య యెంత హెచ్చుగా నుండిన దేశానికంతనష్టము. ఆస్ట్రేలియా ఖండము మనహిందూస్థానముకన్న గొప్పది. అట్లుండినను మన ఇండియాలో ౩౯ కోట్లమంది యుండగా ఆస్ట్రేలియాలో ౭౦ లక్షలమందిమాత్రమే యున్నారు. ఆ ఖండములో ఆదిమనివాసులు కొందరున్నారు. వారిసంఖ్య హెచ్చుటకు మారుగా తగ్గుచున్నది. కొన్ని ఆదిమజాతులు సమూలముగా నాశనమొందింపబడెను. అమెరికాసంయుక్త రాష్ట్రములో ప్రతిచదరపుమైలునకు ఇంచుమించు ౪౦ మందికన్న ఎక్కువగాలేరు. కనడాలోకూడ ఇంతే. ఆస్ట్రేలియా ప్రధాని మొన్న మొన్ననే దేవుడు మేలుచేస్తే యీఖండము తెల్లవారి ఖండముగానే యుండగలదు అని ప్రకటించెను. అనగా ఇప్పుడు కలిగిన జపానుబీభత్సము తమకు తగులకుండా జపాను ఆస్ట్రేలియాను కబళించకుండా, కేవలము తెల్లవారికొరకే ఆ ఖండాన్ని శాశ్వతపు గుత్తాగా ఏర్పాటు చేసుకొందుము అని వారి అభిప్రాయము అమెరికా కనడా దేశాలలో ఏషియాఖండవాసులకు పౌరత్వస్వాతంత్ర్యము లేకుండ శాసించినారు. విషయమిట్లుండ మన భారతదేశములో అట్టి నియమాలేమీన్ని లేవు. మనసంఖ్య హెచ్చగుటచేత మన దేశములో కొన్నికొన్ని రాష్ట్రాలలో జనసమ్మర్దము అత్యధికముగాను కొన్నికొన్ని ప్రాంతాలలో తక్కువగాను కనపడుచున్నది. బెంగాలులో ప్రతిచదరపు మైలులో ౮౦౦మంది. కొచ్చిలో ౯౬౩ మంది ఉన్నారు. ఇది చాలా ఆశ్చర్యకరమగుసంగతము. మన హైద్రాబాదు రాష్ట్రములో ప్రతిచదరపు మైలులో ౧౯౬ మంది మాత్రమే యున్నారు- మనకంటే తక్కువ ఒక్క మధ్యపరగణాలలో మాత్రమే ౧౯౫మంది వంతున ఉన్నారు-తక్కిన అన్ని ప్రాంతాలలో మనకన్న ఎక్కువగానే యున్నారు. ఎక్కడ జనసమ్మర్దం మెక్కువగా నుండునో అక్కడి జనులు జీవనార్థమై యెక్కువ కృషి చేయవలసినవారగుదురు- అందుచేతనో యేమో బెంగాలు కొచ్చిన్ తిరువాన్కూరులలో విద్యావ్యాపక మెక్కువగానున్నది. ఇండియాలో విద్యావ్యాపకములో కనిష్ఠస్థానము వహించినది (ఇప్పటికి లభ్యమైన పట్టికప్రకారము) మనమే. మనతర్వాత మన పొరుగువారగు మధ్యపరగణాలవారు అవిద్యలో ఘనులై యున్నారు.

నగరాలలో జనసంఖ్య హెచ్చుగా పెరుగుట ఈనాగరిక కాలములోని విశేషములలో నొకటైయున్నది. ఇండియాలో ౨లక్షలకు మించిన జనసంఖ్య కల నగరాలు ౨౨ఉన్నవి. ఒక లక్షకన్న మించిన జనసంఖ్యకల నగరాలు (పైవాటిని కలుపుకొని) ౫౭వరకున్నవి. మొత్తము ఇండియాలో జనసంఖ్యను బట్టి అగ్రస్థానము వహించునట్టిది కలకత్తా నగరము. అందు ౨౧లక్ష ౦౯ వేల మంది ఉన్నారు. ఈపదేండ్లలో నూటికి ౮౫ మంది ప్రకారము ఆనగరములో జనులు పెరిగినారు. ఇదెట్లు సంభవించెనో యేమో! ఈజనాభా బెంగాలులో చాలా ప్రాముఖ్యత వహించెను. హిందువులకన్న మునల్మానులు నూటికి ౮పాళ్లుమాత్రమే యెక్కువగా ఉండిరి- ఈ ౮పాళ్లు హిందువులపాలిటపడితే ముసల్మానులు అల్పసంఖ్యాకులగుదురు. అందుచేత అక్కడ జనసంఖ్యను ఉభయవర్గాలవారు పెంచుకొన ప్రయత్నించినారని ఉభయులును పరస్పరము నిందించుకొనిరి. ఫజలుల్ హక్ గారివంటి బెంగాలు ప్రధానియే జనాభా కాలములో హిందువులను బెదరించియుండెనుకదా. ఆకథ మన కెందుకు లెండి. మన హైద్రాబాదు మొత్తము ఇండియాలో నాల్గవ నగరము. ఇచ్చట ఈ పదేండ్లలో నూటికి ౫౬మందికిపైగా హెచ్చైనారు. ఈ విధముగా జనసంఖ్య పెరిగినను హైద్రాబాదు రాష్ట్రమంతటను ఈ పదేండ్లలో విద్యా వ్యాపకము నూటికి ౫నుండి యిప్పుడు ౯.౮ (అనగా వేయింటికి ౯౮) వరకు పెరిగినదనిన అదొక సంతోషింపదగినదికాదు. పదేండ్లలో విద్యపై ఖర్చు రెండంతలు పెరిగెను. విద్యావ్యాపకము మాత్రము రెండంతలైనా కాలేదు. ఈ చీమ నడకతో మన మెన్నాళ్లు నడువవలెను? రెండుకాళ్ళ కుంటివాడు కాశీకిపోయినట్లే యుండును. ఈ అపవాదును తొలగించుటలో ప్రభుత్వమువారును ప్రజలును బాధ్యులై యున్నారు.

— —

హైదరాబాదు, సికింద్రాబాదు కాపుసంఘముయొక్క స్థాయిసంఘమువారు ఈఫిబ్రవరి౨౨వ తారీకునసాయంకాలము సికింద్రాబాదు జేమ్సుస్ట్రీటులో మహాలక్ష్మీభవనమందు ఆమరం రాజయ్యగారిఅధ్యక్షతలో కూడి త్వరలో సికింద్రాబాదునందు అఖిలభారతకాపుమహాసభజరుపనిశ్చయించిరి. ఈసంబంధమైనపనులనుజరుపుటకై ఒకసమితినిఏర్పాటుచేసిరి. కాలము,స్థలము మున్నగువిషయములు ముందు ప్రకటించగలరు.

# స్థానికవార్తలు

వృషసం॥ ఫాల్గుణ శు॥౫ శుక్రవారమునాడు పగలు పదకొండుగంటలకు హైదరాబాదునగరములోనుండు కులీనాధనసధర్మశాలలో సంతపూరి అనంతమ్మగారికి రావులకోలు నరసింహారావు గారికిని వివాహముజరిగెను. వధువుగోలకొండ వ్యాపారులకును వైష్ణవబ్రాహ్మణకుటుంబమునకు చెందిన ౧౭సంవత్సరముల బాలవితంతువు-వరుడు వధువుయొక్క బంధువర్గములో చేరిన ౨౨సంవత్సరములయువకుడు, విద్యావంతుడు. సికిందరాబాదువాస్తవ్యులగు నిమ్మగడ్డ పుల్లయ్యశాస్త్రిగారు వివాహకర్మనుచేయించిరి. శ్రీఆక్కపెల్లి జానకిరామరావుగారు, మందుముల రామచంద్రరావుగారు, గూడాపెరుమాళ్ళ పండితులుగారు, బూర్గులరామకృష్ణరావుగారు, మందుముల నరసింగరావుగారు, బూర్గుల వెంకటేశ్వర రావుగారు, దోమలపల్లియాదగిరిరావుగారు, మొదలగువారంతా సుముహూర్తమునకువిచ్చేసి వధూవరులనాశీర్వదించిరి. ఈవివాహమునుజరిపించుటకు తోడ్పడినయువకమహాశయులందరు ప్రశంసనీయులు,

... ... ...

బొంబాయి ప్రభుత్వమువారి డ్రాయింగు (ఇంటర్మీడియేటు)పరీక్షలో హైదరాబాదు నారాయణగూడెముబాలికలఉన్నతపాఠశాలావిద్యార్థినులలో ఈక్రిందివారు ఉత్తీర్ణులైనారు:- ౧. శ్రీకొండాసుమిత్ర), ౨. సుజాతలిరెడ్డి,

... ... ...

ఈఫిబ్రవరి ౧౯వతేది నాయంత్రము నారాయణగూడెం బాలికలఉన్నత పాఠశాలలో నాగపూరునుండి వచ్చిన శ్రీ గోపాల రావు అనువిద్యార్థి యోగాభ్యాసమువందు తనకుగల నైపుణ్యమునుప్రదర్శించెను ఒకగంటలో వెంటన పనులనుచేయుటయేగాక వానిపేర్లను, ఉద్దేశలాభములనువిశదపరచెను. ఆవయవములు, ఉదరము, తల, మెదడు మొదలగువానికి దగినసాధనమును, నెత్తురు పారుదలకుమార్గములను వాయువులనుబయటికిదొలగు మార్గములను, మెదడును శాస్త్రనుచేగడుగువిధము మున్నగువిషయముల నుపన్యసించెను ఆతనిశ్రమకు గాను, విద్యాభ్యాసనహాయార్థముగాను స్కూలుబాలికలు ద్రవ్యసహాయముచేసి గౌరవించి సంతోషమును వెల్లడించిరి,

... ... ...

హైద్రాబాదుపోలీసుఅనుకంటకముగా నుండిన ఒకఅరబ్బు ఈరాష్ట్రమునుండి బయటికి తరిమివేయబడినాడు.

... ... ...

గుల్బర్గాలోఫిబ్రవరి ౨౭ ౨౮ తారీకులలో జరుపుటకునిర్ణీతమైయుండిన హైదరాబాదువిద్యామహాసభవార్షికసమావేశము ఆరోజులలో మానకొనుటకు ఆహ్వానసంఘమువారు తీర్మానించుకొన్నారట.

... ... ...

ఈవసంతకాలములో దోమలుగ్రుడ్లుపెట్టి పిల్లలనుచేయుట ఎక్కువగా జరుగుచుండునుగనుక, అందుకువీలుగాకుండ ప్రజలు గుంటలు, మోరీలు మున్నగువాటిలో నీళ్ళునిలకకుండ శుభ్రముగానుంచుకొనవలెననియు, అప్పటికిని కొన్ని దోమలు తప్పించుకొనవచ్చుననియు, కాబట్టి ఆరోగ్యశాఖవారు ప్రభుత్వానుమతితో ప్రజలకు దోమలనుచంపేటి ఒకమందును గ్యాలనుకురూ౪-౪-౦లవరకును దానినిచల్లుపంపు ఒకటింటికి రూ౨-౨-౦లుకంటును అమ్మదలచినారు- ఈమందువల్ల దేనికినిహరకలుగదట: వారానికిరెండుమారు పర్యాయము దీనిచల్లుకొన్నను ఈవసంతకాలానికంతాకలిపి౨ఆర్థగ్యాలనుపరిపోవునట. ప్రజలకుగాని ప్రభుత్వానికిగాని ఈమందువల్లవిధమును ఆడిగినచో వాటరియాశాఖవారు తెల్పించెదరట,

... ... ...

ఉస్మానియాలోఆర్యమహాసభ పండిత వినాయకరావుగారిఅధ్యక్షతనజరిగిన సంవర్సమునలో ఆపస్మియా స్మృతి గరిమనుబోధపరించి ఒకఆజ్ఞ ఒకరోజు వరకు ఆమలులోనుంచబడినట్లు "డక్కన్ క్రానికల్"కు తెలిసినది.

... ... ...

హైదరాబాదు నగరాభివృద్ధిశాఖవారుకట్టించిన మూడంతస్తుల కిరాయియిండ్లను ప్రధానమంత్రియగు ఛతారినవాబుగారు కొన్నిరోజులక్రింద చూడబోయినపుడు బీదజనులు కిరాయిలుఎక్కువగానున్నవని మొరపెట్టుకొన్నందువల్ల,ఛతారినవాబుగారు ఆలోచనచేసి శ్రీప్రభువరేణ్యుని అనుమతితో రూ. ౬ఉన్నకిరాయిని రూ౪లకు తగ్గించినారు. ... ... ...

పొలంతనునాతడు ౧౯ఆబాద్ వాడు చౌరాఏజన్సీ గల్లీలో కిషన్‌సింగు,వెంకయ్యలనువారలను ఒకపోలీసుజవానును జంబియాతో పొడిచినట్లును, కిషన్‌సింగు పోలీసుజవానులు ఆగాయములచే వైద్యశాలలో మరణించినట్లును ఒకఅభియోగము ఇపుడు హైదరాబాదు ఉన్నతన్యాయస్థానమందు ఖాజా అబ్దుల్‌అలీగారి సన్నిధిలో విచారణజరుగుచున్నది.

... ... ...

ఔరంగాబాదుజిల్లానుండి కొందరు కరువుపరిస్థితులవల్ల సమీపమునందున్న బ్రిటిషిండియాలో కిపోయినట్లు రూఢికాని సమాచారమువక్కన్ క్రానికల్" పత్రికకు తెలిసినది.

... ... ...

హైదరాబాదు,కర్నూలు,మదరాసు,బొంబాయిలలో గొప్పనవాబులవలె సంచరించి మోసముచేసి కొన్నివేలరూపాయీలు సంపాదించిన కొండకుమోసగాండ్ర కూటమునకు సంబంధించిన వ్యవహారములలో, ఆకూటములో ఒక డని చెప్పబడుచున్నట్టియు, మిలిటరీలో చేరినట్టియు మన్సూరీఖాన్ అనువానిని హైదరాబాదు నగర పోలీసులకొరకై బొంబాయినగరములో ఆరెస్టు చేసినారు. ఈతడు బొంబాయిలో మెరినాహోటలులో గొప్పనవాబువలె నివసించుచున్నపుడు నమ్మన్నాల్ రఘునాథ్ జీఅనుసరాబునుఅతనికిపరిచయముచేసిరి. అసరాబు ఈ "నవాబు" మంచి దర్జాగల నవాబని నమ్మెను. తర్వాత ఆ"నవాబు" యుపకుల చిక్కుకచ్చినందువల్ల తనబంగారునగలను కుదువపెట్టి పెట్టు పొందగోరుచున్నానని చెప్పిరి. అసరాబుఅందుపై రూ,౭౫౦౦౦లను అతనికిచ్చిబంగారునగలులోపలఉంచిపైన సీలువేసినపెట్టెను తీసికొనెను. సరాబు పెట్టెతీసికొనిఇల్లుపోవునపుడు మన్సూర్ ఖాన్ దానిపెట్టెమొరొకగదిలోనుండు తనచేగంపాపెట్టెను మార్చితెచ్చెదనని తీసికొనిపోయి అపెట్టెనుయిచ్చేక అంతయు మొకటిపెట్టెవలెనేయుండి లోపలనగలుమాత్రము లేనిపెట్టెను తెచ్చియిచ్చెనట- తర్వాత రఘునాధ్ మోసముకొని పోలీసులకు తెల్పగా పోలీసులావోషిని ఆరెస్టుచేసి హైదరాబాదుపోలీసులకు తెలియబరచినారు- ఇపుడు బొంబాయిపోలీసులు అతనిని హైదరాబాదునగరపోలీసులకు అప్పగించినతర్వాత,ఖాద్రిమున్సిఫుకోర్టులపై అభియోగము విచారణకుపంపించబడగలదు-

... ... ...

కులకర్ణిఅనువారిచే రచితమై హైద్రాబాదులో ప్రకటితమైన "హాల్‌స్టార్"అను మహారాష్ట్రగ్రంథము హైదరాబాదుసంస్థానములో నిషేధించబడినది. దానిఅనువాదగ్రంథములు కూడ ఇక్కడ నిషిద్ధములు.

— —

## చైనా నాయకునితో మహాత్ముని సమావేశము

ఆలస్యమునకు కారణము

పండిత జవహర్లాలు నెహ్రూగారు ఫిబ్రవరి ౧౭వ తేదిఉదయము క్రొత్తఢిల్లీలో పత్రికల ప్రతినిధుల ప్రశ్నలకు సమాధానము లొసగుచు "గాంధిమహాత్ముడు మార్షల్ చియాన్ గుకేషేఖ్ గారిని చూడ నిరాకరించెననుట పూర్తిగా అసత్యము" అని చెప్పిరి. మరి ఎందువల్ల చూడలేదనుదానికి యిట్లు చెప్పిరి- నెహ్రూగారు చైనా నియంతతో మాట్లాడినతర్వాత గాంధిమహాత్మునితో టెలిఫోనులో సంభాషించెను- తర్వాత మహాత్ముడు చైనానాయకునికి ఒక టెలిగ్రాము సందేశము పంపెను- ఆసందేశములో వారు, తానును కస్తూరిబాయియు చైనానియంతకును వారిసతికిని తనసేవాగ్రామమందు స్వాగతమిచ్చిన అచ్చైనీయముఖ్యులు తనపని ఎటువంటిచోట జరుగుచున్నదో చూచెదరను ఆశతో నుంటిననియు. ఇది సాధ్యము కానిచో భారతదేశములో ఎక్కడికిగాని పోయి ఆ చైనీయ ముఖ్యులను చూడ సంసిద్ధముగ నుంటిననియు, కాని తనవశమునలేని పరిస్థితుల ఆటంకమువల్ల ఆ అదృష్టము తనకు లభించలేదనియు- చెప్పి చైనాకును చైనావారు పాటుపడుచున్న ముఖ్యవిషయమునకును తనశుభాకాంక్షలను తెలిపిరి- గాంధిగారు తరువాత ఒక లేఖను కూడ చైనానియంతకు పంపిరి.

చైనానియంత ఈదేశమునకును అతిథి. అందువల్ల తాను స్వాగతమిచ్చువారివద్దకు పోదగునేగాని, స్వాగతమిచ్చేవారిని తనవద్దకురమ్మనుట చైనీయుల ఆచారానికి విరుద్ధము- కనుక వారు మహాత్ముని తనవద్దకురమ్మని అడుగరాదని ఎంచినారు.

చైనాప్రియగారు జిన్నా, సంస్థానాధీశులు మున్నగుకొందరికి చైనానియంతతో కలిసి మాట్లాడుటకు ఆహ్వానములను పంపియుండిరి- అట్టిఆహ్వానములను గాంధి మహాత్మునికిగాని, జవహర్లాలుకుగాని పంపలేదు- చైనానియంత ఒక వర్గమువారిని కాక సమానముగ అన్ని రెండవపక్షమువారిని కూడ చూచే ఏర్పాటుచేయవలెనని అధికారులు భావించినట్లున్నది.

### చైనాయెడ ఇండియా వైఖరి

చైనాయెడ భారతదేశానికి సానుభూతి గలదు- చైనాపక్షమును బలపరచుట భారతదేశపద్ధతి, కానిబ్రిటిషు ప్రభుత్వము వారిద్వారా చైనాకు సహాకారము చేయవలసినదేగాని నేరుగా చేసేటట్లులేదు- యుద్ధానికి ముందునుండియే కాంగ్రెసు అదిసీనియా విషయంలో వలెనే చైనా విషయమునందును సానుభూతిగలిగియుంటున్నది- అంతేగాక చైనాతో ప్రాచీనమైనసంబంధము భారతదేశానికి చారిత్రికముగ గలదు- చైనీయులు ఇప్పుడు యుద్ధములోనేగాక భవిష్యత్తులో కూడ భారతదేశముతో కలిసి పనిచేయగోరుచున్నారు- "మేము వారికి సంతోషముగా సహాయముచేసెదము కాని మా చేతులు బంధములలో నున్నవి" అని కాంగ్రెసు చెప్పుచున్నది- ఈబంధములు తొలగిపోయిన బాగుండునని ఆచైనానాయకుడు కోరుట సహజమే- వారు ఈబంధములను తొలగించు విషయములో బ్రిటిషుప్రభుత్వమునకు ఏమి తెలియజేయగలరో చెప్పుట కష్టము. మరొకరాజ్య వ్యవహారములలో జోక్యము కల్పించుకొనుట కష్టము.

### గాంధి గారి ప్రతిఘటన పద్ధతి

పాశ్చాత్యులు "పాసిజం" అను పదముచే ఉద్దేశించే పద్ధతికిని, గాంధి మహాత్ముని శాంతి పద్ధతికిని భేదమున్నది- గాంధిమహాత్ముని పద్ధతి చురుకైనది- ఏమైనను శత్రువుకు లొంగుట కూడదనునది గాంధిమహాత్ముని పద్ధతి. శత్రుప్రతిఘటన ఎట్లు చేయవలెనను ప్రశ్న ఉదయించినపుడు కాంగ్రెసు దానిని నిర్ణయించవలసియుండును- గాంధి మహాత్ముడు అహింసాపద్ధతిని సూచించును- కాని ప్రత్యేక పరిస్థితులలో వారేమి చెప్పెదరో! వారి పరిస్థితులకు తగినట్లు నడచుకొనువారు ఇతరులను కూడ అట్లు నడచుకొనవిత్తురు- భారతదేశ ప్రసరిహద్దులకు ఆమూలనైన ప్రతిఘటనవిష్ఫలమైపై ఈ దేశంలో అట్టిప్రతిఘటన చేయలేని స్థితి ఏర్పడవచ్చును అప్పుడు గాంధిమహాత్ముని పద్ధతికంటె ఉపాయము లేదు.

... ... ...

ఇండియాప్రభుత్వమువారు ౧౭వ తేదినాటి ప్రకటనలో గాంధిమహాత్మునికి వైస్రాయిగారు ఆహ్వానము పంపలేదనుమాటకు సమాధానమిచ్చినారు. మిమ్ము అనకలిసికొనుటకు అవకాశమొసగుడని చియాంగుకేషేక్ గారు ముఖ్యముగా కోరుచున్నారని నాకు తెలిసినదను వాక్యముగ అపత్రము అను వైస్రాయిగారు జిన్నాగారికిని గాంధిగారికిని ఒకరీతిగ పంపినారు. గాంధిగారికి వర్ధా జిల్లాధికారి ఆపత్రమును ఫిబ్రవరి ౧౦వ తేదిన అందజేసినారు. అని అందులో తెలుపబడినది.

## అలహాబాదు వద్ద రైలుప్రమాదము

అలహాబాదునుండి ౫౦ మైళ్లదూరములో కాన్పూరుకుపోవు రైలుబాటయందు ఖాగావద్ద రెండు రైళ్లు ఎదురుగావచ్చి ఢీకొనుటచే ఇంతవరకు ౧౫మంది చచ్చినట్లును, ౨౦మంది గాయపడినట్లును తెలిసినది- ఈ ఉపద్రవము ఫిబ్రవరి ౧౯వ తేదిన మధ్యాహ్నము ౧గం.౩౦ని.ల వేళ జరిగినది- మూడు ప్రయాణీకుల డబ్బాలు చాలా చెడిపోయినవి.

### భారత శాసనసభలో చీనానాయకుని అభినందనము

భారతశాసనసభయగు అసెంబ్లీలో ఫిబ్రవరి ౧౯వ తేదిన "చీనాప్రధానసేనాని మార్షలుచాంగు కేషేఖుగారును శ్రీమతిగారును ఇండియాకిప్పుడు రావడంవల్లనీరు ఇండియాపట్ల అత్యధికమైన గౌరవభావమును చూపించారు. వీరుచూపిన యీగౌరవమును యీసభవారు మిక్కిలి అధికముగా ప్రశంసించుచున్నారు. జపానువారిని నిరోధించుటలో మార్షలుచాంగుకేషేఖుగారి నాయకత్వముక్రింద చీనాలోని రణశూరులు అనేక సంవత్సరాలనుంచి అత్యధికమైన శౌర్యప్రతాపాలను చూపిస్తూ చీనాకున్న ప్రపంచానికంతటికిన్నీ కూడా మిక్కిలి గొప్పసేవ చేసినందుకున్నూ జపానువారిని ప్రతిఘటించుటలో చీనావారిప్పుడు ఇండియావారితో చేరినందుకున్నూ ఈసభవారు ఈ దంపతులను అత్యధికంగా ప్రశంసిస్తున్నారు" అనే తీర్మానమును ఎమ్.ఎస్ అనేగారు ప్రతిపాదించిరి- ఈతీర్మానమేకగ్రీవంగా ఆమోదించబడెను-

### ఇండియాలో ప్రీవీకౌన్సిలు

అలహాబాదు హైకోర్టులో పూర్వము జడ్జిగా వుండిన సర్ షామహమదు సుల్తానుగారును ప్రధాన న్యాయమూర్తిగా వుండిన సర్ జానుథరుగారున్నూ ౧౯౪౧లో చనిపోయిరి. వీరికి స్మారక చిహ్నముగా అలహాబాదు హైకోర్టుభవనంలో మార్బిలుహాలులో రెండుశిలాఫలకము అమర్చబడెను. ఇండియా ఫెడరలుకోర్టు ప్రధానన్యాయమూర్తి సర్ మారిస్ గ్వయరుగారు బహిర్గతమొనర్చుచు ఫిబ్రవరి ౧౯వ తారీఖున ఇట్లు చెప్పిరి-

"ఇప్పుడు ఇండియాలోవున్న అన్ని న్యాయస్థానములలోను ఫెడరలు కోర్టు వున్నతోన్నత న్యాయస్థానంగా వున్నదికాని ఫెడరలు కోర్టుకుయింకా అన్ని విషయాలలోను సంపూర్ణమైన అధికారము యివ్వబడలేదు అచిరకాలంలో నేఇండియాలో ప్రీవీకౌన్సిలుతో సమానముగా సర్వాధికారములతో కూడిన ఉన్నతోన్నత న్యాయస్థాన మేర్పడగలదని నేను నమ్ముచున్నాను. న్యాయమూర్తులు న్యాయవాదులుకూడా ప్రజలసేవకులేగనుక ప్రజలువీరిచర్యలను యెంతతీవ్రముగా విమర్శించినను వీరు ఆగ్రహమును చెందగూడదు- న్యాయస్థానముల స్వాతంత్ర్యమునకు లేశమైనను లోపము కలుగగూడదు. న్యాయస్థానములలో న్యాయమూర్తులు నిష్పాక్షికముగా తమవిధిని నెరవేర్చుటకే విధమైనఅభ్యంతరము కలుగగూడదు, న్యాయవాదులు లేకపోతే న్యాయస్థానాలు పనిచేయజాలవు న్యాయవాదుల స్వాతంత్ర్యమును కలిగియుండవలెను"

### పంజాబుప్రధానితో కాంగ్రెసుఅధ్యక్షుని సంభాషణ

కాంగ్రెసు అధ్యక్షుడగు మౌలానా అబుల్ కలాం అజాదుగారు పంజాబు ప్రధానితో ఫిబ్రవరి ౧౯వ తేదిన సంభాషించిరి, దేశమునకు శత్రువు వల్ల ఉపద్రవము వచ్చేటట్లున్నచో కాంగ్రెసు ఇతర సంస్థలతో కలిసి పనిచేసి శాంతి నిరక్షించు పద్ధతుల విషయమై వారుమాట్లాడినట్లున్నది, కొందరు ముస్లింలీగు ప్రతినిధులును, హిందూమహాసభ ప్రతినిధులును కూడ కాంగ్రెసుఅధ్యక్షునితో సంభాషించిరి-

## చైనానాయకునితో జిన్నాగారి సమావేశము

కలకత్తా, ఫిబ్రవరి ౧౯-

"మార్షల్ చియాంగు శేకుతో నేను హృదయపూర్వకముగా సంభాషించినాను, నాకునిక్కై నప్పుడు చైనాకురావలసినదనియు నేను అక్కడికివస్తే సంతోషిస్తాననియు మార్షల్ శేకుగారు మనస్ఫూర్తిగానన్ను ఆహ్వానించిరి. ఇంతమట్టుకు నేను మీకుచెప్పగలను" అని ముస్లింలీగు అధ్యక్షుడు జిన్నాగారు ప్రభుత్వమందిరంలో బసచేసిన మార్షల్ జంగు శేకుగారినికలుకొని ఇవతలికివచ్చి తరువాత "అసోసియేటెడ్ ప్రెస్ విలేఖరితో అనెను ఈసమావేశము ఒకగంటసేపు జరిగినది. జిన్నాగారు ఇంకా ఇట్లు చెప్పిరి, "భారతదేశపు రాజకీయసమస్యలలో జోక్యము కలిగించుకొనుటకు తానుఇక్కడకు రాలేదని మార్షల్ గారు చెప్పిరి. దానికి కారణము భారతరాజకీయములను గురించితనకు యేమితెలియక పోవడమేనని కూడ వారనిరి. భారతరాజకీయ పరిస్థితినిగురించి తెలిసికొనగోరుచున్నాననిరి. లీగుప్రణాళికను, కార్యక్రమాలను తెలుసుకొనగోరుచున్నాననియు దానికిసంబంధించిన ప్రకటనలన్నిటినీ తనకుపంపవలసినదనియు వారుఅడిగిరి. నన్నుమరల కలుసుకోవలెనని వారుకోరిరి- ౧౯వతారీకువరకు నేను ఇక్కడేవుందునని చెప్పినాను"

## కాంగ్రెసుకార్యాలయానికి రాజాలనని విచారం

ప్యూకధి లేనందున కాంగ్రెసుప్రధాన కార్యాలయానికి రాజాలనందుకు చింతిస్తున్నామని షేక్ దంపతులు, కాంగ్రెసుప్రధాన కార్యదర్శి ఆచార్యకృపలానీగారికి తంతిపంపించిరి.

—·—

డాక్టరు

# శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

బెజవాడ (లేక) రాజమండ్రి

వారి యీ క్రిందిమందులు యీక్రింది వ్యాధులకు అమోఘముగ పనిచేయును.

**ఆరోగ్యసుధ**
సమస్త సెగసవాయివ్యాధులకు 60 మా॥ 4-0-0

**స్త్రీసుధ**
స్త్రీలసమస్తగర్భాశయవ్యాధులకు60మా॥3-0-0

**ఆనందసుధ**
బలహీనత సమస్తవ్యాధులకు 8 ఔ॥ 2-8-0

**ప్రదరామృతము**
స్త్రీల శ్వేతరక్త ప్రదరములకు 60 మా॥ 4-0-0

**ప్రమేహసుధ**
సమస్త శుక్రనష్టములకు 60 మా॥4-0-0

**రత్నసుధ**
చర్మవ్యాధులకు రక్తదోషములకు 60మా॥ 4-0-0

**దివ్యసుధ**
గర్భిణీస్త్రీల సమస్తవ్యాధులకు 60మా॥ 4-0-0

**సర్వసుధ**
ముష్టిమైథునమువలన బలహీనతకు60మా 10,00

**సర్వామృతము**
పాండువు,మధుమేహం మొ॥వానికి60మా 4-0-0

**సుధానిధి**
దగ్గు, ఆయాసము, క్షయలకు 60 మా॥ 4-0-0

**బాలసుధ**
బాలురజ్వరము,అజీర్ణము మొ॥వానికి50మా 1.0 0

**దివ్యామృతము**
కీళ్లనొప్పులు మొ॥సమస్తవ్యాధులకు60మా॥4-0-0

**జ్వరసుధ**
సమస్తజ్వరములకు 100 మా॥ 5-0-0

**విషమ జ్వరసుధ**
చలిజ్వరము మొ॥ వానికి 60 మా॥ 5-0-0

**అజీర్ణసుధ** సమస్తఅజీర్ణములకు 100మా॥6-0-0

ఇంకను శాస్త్రీయమగు సమస్తాయుర్వేదౌషధములును అత్యుపయోగకరములగు వైద్యగ్రంథములునుగలవు. కేటలాగు ఉచితము.



అమాయకులగు బాలురను కష్టములనుండి రక్షించుట తల్లుల ప్రథమకర్తవ్యము

•

పిల్లల ఆరోగ్యబలములకు

## ఇన్ఫాంటోన్‌ను జ్ఞప్తియందుంచుకొనుడు

దేశమునందు సుప్రసిద్ధమైన ప్రయోజనకారి

ఇట్టివి అనేకమందులు తయారగుచున్నవి

## కాని ఇన్ఫాన్టోన్‌తో సరిరావు

దీనియందు వాటికంటె గుణమధికముగా నున్నను
ధరమాత్రము ఏమాత్రము పెంచలేదు

## ఇన్ఫాంటోన్‌ను జ్ఞాపకముంచుకొనుడు

ప్రతిస్థలమందు దొరకును.    సీసా 1కి ధర 15 అణాలు

హైద్రాబాదు కెమికల్ అండు ఫార్మస్యూటికల్ వర్క్సు లిమిటెడ్,
హైద్రాబాదు దక్కన్.

Khan&Sons

# నాకేమైనా ఔతుందంటే నీకు నిర్లక్ష్యమా నాన్నా?

ఏ ఆలోచనా పరుడు కూడా తనసర్వంత ప్రియమైన తన కుటుంబము, తన యిల్లు, తన భావిరక్షణ—యివి యీకలంలో మహోపద్రవానికి గురియైయున్నవని గురుతించకుండా వుండలేడు. అయితే అమూల్యమైన ప్రాణాలను స్వాతంత్ర్యమును రక్షించుటకు సహాయపడగలడు, రక్షణల మూలమున ఇండియా బలమును వృద్ధిపరచుట మూలముగ సహాయపడగలడు. కాని ఆలసింపక వెంటనే పూనుకొనవలెను. డిఫెన్సు సేవింగ్సు సర్టిఫికేట్లు కొనుటకిదే సమయము.

మీరు పెట్టుబడిగనీయగం ప్రతి ఒక్క అణాయు హిందూస్థానపు సైనిక, నౌకా, వైమానిక బలములను హెచ్చించి తన్మూలమున శత్రుదాడిని ఎదిరించుటకు హిందూస్థానమును బలపరచును పూర్తి వివరములు పోస్టాఫీసులనుంచి

ప్రతి రు 10/-ల డిఫెన్సు సేవింగ్సు సర్టిఫికేట్లు రు 8-9-0 లాభమునిచ్చును

G.I. 74 TG.

# ఆయుర్వేదఔషధములకు

## 48 యేండ్లనుండి ఉంఝాఫార్మసీ ప్రసిద్ధి కెక్కినది

### శీతకాలమునందు బలమునకు పటుత్వమునకు ఈదిగువ ఔషధములను వాడుడు

## సువర్ణ వసంతమాలిని

ఆయుర్వేదములో ప్రశస్తమైనఔషధము. సన్నిపాతజ్వరము, దీర్ఘకాలమునుంచి వున్న జ్వరము, క్షయ,జలుబు,రక్తమునకారుట, అజీర్ణవ్యాధులకు,నిస్సత్తువ, ఉబ్బసమునకు అద్భుతమైన మందు. నిస్సత్తువను పారద్రోలును. పొద్దున ఉదయము ౧మాత్ర, సాయంత్రము ౧ మాత్ర తేనెతోను చెప్పవెంటులోను పుచ్చుకొనవలెను. భోజనము చేయునపుడు పాలను, నెయ్యిని ఎక్కువగా తీసికొనవలెను. జీర్ణశక్తిని కలిగించి ఎంతఆరగని పదార్థముతిన్నను జీర్ణమగునట్లుచేయును. అందమును, సత్తువను వృద్ధిపరచును. బలహీనులకు వీర్యవృద్ధినికలిగించి ఎక్కువశక్తినిచ్చును. ధర: తులము ౧ టికి రు ౧౦. ప్రత్యేకమైనది రు౧౫-౦కతులం [ప్రత్యేకరకం మందులో మంచిముత్యములు, రససిందూరము, హింగుళ బదులు చేర్చబడినవి, ఫారిన బదులు బంగుభస్మము రెంటిలో చేర్చబడినది.

## అమీరీ జీవన్
(రిజిస్టర్డు)

'వ్యవస్థప్రాశతేహ్యము'లో చేర్చబడినవస్తువులుగాక కొంగలఆయుర్వేదయునానిమందులుగలవు. ఇందుకుంకుమపువ్వు, మేలైనఅభ్రకభస్మము, రససిందూరము వంగభస్మములుచేర్చుటవలన, గుణమునందు చ్యవనప్రాశకంటె అమోఘమైనది. సప్తధాతువులకు బలమునకలిగించి శరీరమునకునూతనశక్తి నిచ్చును. వీర్యస్ఖలనము, దగ్గు, ఉబ్బసము, క్షయం, శారీరక, మానసికబలహీనతలనుగూడనయము చేయును. పొద్దున, పాలతో ౧½తులమునుండి 3 తులములవరకు ఉదయము,సాయంత్రముతీసుకొనవలెను. ధర, ౧౦ తులములకు రు ౧-౮-౦. ఒక పౌను నాలుగురూపాయలు.

| స్త్రీల వ్యాధులకు **సుందర సంజీవని** (ఏనుగమార్కు) | సమస్త జ్వరములకు శ్రేష్ఠమైనది **మలేరియా మిక్స్చర్** (ఏనుగమార్కు) | **మకర్ధ్వజ వటి** (రిజిస్టర్డు) |
|---|---|---|
| కుసుమరోగము, బహిష్టురోగము, గొడ్డుతనము, మూత్ర వ్యాధులను నివారణచేయును. ధరసీసా ౧ కి ఒకరూపాయి 3 సీసాలకు రు. ౨-౧౦-౦ | మలేరియా, అంతము లేని దీర్ఘ కాలజ్వరములకు, తగ్గుచు వివచుచుండు జ్వరము లను నిర్మూలముచేయును ధర సీసా1టికి రు ౦-౧౦-౦. | వీర్యస్ఖలనము, వీర్యము పల్చబడుట- స్వప్న దోషములు, నపుంసకత్వము,గనోరియా,నిస్సత్తువులను శీఘ్రకాలములోనివారణచేయును. 30మాత్రలుగలబుడ్డి రు 3. |

పైన ఉదహరింపబడినవేకాక రస, భస్మ, గుటిక, మాత్ర, అవలేహ, ఆసవ అరిష్ట మొదలగునవి స్టాకులో ఎల్లప్పుడు ఉండును, సంపూర్ణ ఆయుర్వేదపద్ధతులతో తయారు చేయబడినవి.

# ఉంఝా ఆయుర్వేదఫార్మసి

| గాంధిరోడ్ | కలబాదేవి | లక్ష్మీరోడ్ | ఉంఝా. |
|---|---|---|---|
| అహ్మదాబాదు | బొంబాయి 2. | పూనాసిటి | ఉ. గుజరాత్ |

నైజాంస్టేటు ఏజంట్లు:- మెసర్సు, బి. ప్రాణజీవన్ ద్యాస్ అండు కంపెనీ. సికింద్రాబాదు, నిజామాబాదు, వరంగల్.

నోటీసు- ప్రతిస్థలమునందు ఏజంట్లు కావలెను. ఏజన్సీకై వివరములకు వ్రాయండి. కేటలాగు ఉచితము.

# "ఈశ్వర్సు కుముద"

స్త్రీలకు కలుగు ఋతుశూల, బహిష్టికాకుండుట, అకాలబహిష్టి మైలజాస్తిగాను తక్కువగాను పోవుట, సంతానహీనత, ఎర్రకుసుమ, తెల్లకుసుమ, గర్భము పోవుచుండుట, గర్భాశయము తనస్థానమునుండి తప్పినపుడు కలుగుబాధలు,గర్భస్రావముచే కలుగుదోషములు, నడుమునొప్పి, కాళ్లులాగుట, హిస్టీరియాను కుదుర్చును. సూతికానొప్పినిపోగొట్టును- గర్భాశయవ్యాధుల నన్నిటిని తగ్గించి ఆరోగ్యమునిచ్చును-    4 ఔన్సుల సీసా 1కి రూ, 1-14-0

ఈశ్వరఫార్మసి    పి. బి. 127 మద్రాసు

ఏజన్సీ:-3168, కింగ్సువే, సికింద్రాబాదు-

